శ్రీ గణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః శ్రీపాద వల్లభ నరసింహ సరస్వతి శ్రీ గురు దత్తాత్రేయాయ నమః

శతశ్లోకీ వాల్మీకి రామాయణం

ధ్యాన శ్లోకాలు:

1. తెల్లని వస్త్రములను ధరించి, సర్వ వ్యాపకుడై, చంద్రుని పోలిన శరీర వర్ణం కలవాడై, నాలుగు భుజములతో, ప్రసన్నమైన ముఖముతో విరాజిల్లే వినాయకుని, సమస్త విఘ్నములను నివారించి శాంతిని చేకూర్చుటకై ప్రార్థిస్తున్నాను.

2. తెల్లని పద్మము వంటి ముఖము గల సరస్వతీదేవిని ఎల్లవేళలా నా చెంతనే ఉండి అనుగ్రహించమని వేడుకొంటున్నాను.

3. సమస్త బ్రహ్మాండములూ తన రూపమే అయిన, చరాచర జగత్తంతటా వ్యాపించి ఉన్న సద్గురు దివ్య పాదపద్మములకు నమస్కరిస్తున్నాను.

4. 'రామ, రామ' అనే పలుకులను శుద్ధమైన కవిత్వమనే చెట్టు కొమ్మపై కూర్చుండి మధురంగా గానం చేస్తున్న కోయిల వంటి వాల్మీకి మహర్షికి శిరస్సు వంచి వందనం చేస్తున్నాను.

5. అంజనాదేవి పుత్రుడు, గొప్ప శూరుడు, జానకీదేవి శోకాన్ని పోగొట్టినవాడు, వానరవీరుడు, అక్షకుమారుని సంహరించినవాడు, లంకా పట్టణాన్ని భయపెట్టినవాడు అయిన హనుమంతునికి నమస్కారము.

6. వేదములచే తెలుసుకోదగిన పరమాత్ముడైన శ్రీ మహా విష్ణువు, దశరథుని కుమారుడైన శ్రీ రామునిగా అవతరించగా, వేదసారమైన రామాయణం వాల్మీకి మహర్షిచే రచింపబడినది.

7. రామా, రక్షకుడవు, ఆనందమునిచ్చువాడవు, సృష్టికి మూలమైనవాడవు, రఘువంశమునకు కిరీటమువంటివాడవు, సీతాపతివి అయిన నీకు నమస్కారము.

శతశ్లోకీ రామాయణం

1. నిరంతరం తపస్సులోను, లేక వేదాధ్యయనములోను నిమగ్నుడై, పాండిత్యములో అగ్రగణ్యుడైన నారద మహర్షిని, ముని పుంగవుడైన వాల్మీకి ఇలా ప్రశ్నించాడు.

2-4. "నారదా! లోకంలో ప్రస్తుతం గుణవంతుడు, వీరుడు, ప్రజ్ఞావంతుడు, కృతజ్ఞతతో నిండినవాడు, సత్యసంధుడు, దృఢమైన సంకల్పములు కలవాడు, సద్వంశమునకు చెందినవాడు, సమస్త జీవకోటినీ ప్రేమించేవాడు, సమస్త విద్యలలో ప్రవీణుడు, సమర్థుడు, అందగాడు, ఆత్మజ్ఞాని, క్రోధాన్ని జయించినవాడు, తేజోవంతుడు, అసూయ లేనివాడు, దేవతలకు కూడా భయాన్ని కలిగించేవాడు ఎవరు?

5. మహర్షీ! ఈ విషయం తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా ఉంది. చెప్పగల సమర్థత కలవాడవు నీవే."

6. ముల్లోకాలలోనూ జరిగే విషయాలన్నిటినీ తెలిసిన నారద మహర్షి, వాల్మీకి అడిగిన ప్రశ్నకు సంతోషించి, "చెప్తాను, విను," అన్నాడు.

7. "నీవు కీర్తించిన ఇన్ని గుణాలూ ఒకే వ్యక్తి కలిగి ఉండటం దుర్లభం. అయినా ప్రస్తుతం ఇవన్నీ ఉన్నటువంటి ఒక మనుష్యుని గురించి చెప్తాను. శ్రద్ధగా విను".

8. ఇక్ష్వాకు వంశంలో జన్మించి, జనులచేత 'రామ' అని పిలువబడే మహావీరుడు, ఆత్మ నిగ్రహం కలవాడు, తేజోవంతుడు, ధైర్యశాలి, ఇంద్రియాలను జయించినవాడు,

9. బుద్ధిశాలి, నీతిమంతుడు, మంచి వక్త, సంపన్నుడు, సునాయాసంగా శత్రువులను సంహరించేవాడు, గట్టి భుజములు, బలమైన బాహువులు కలవాడు, శంఖారావం వంటి కంఠధ్వని, దృఢమైన దవడలు కలిగిన వాడు,

10. విశాలమైన వక్షస్థలము కలిగి, అద్భుతమైన ధనుస్సును ధరించినవాడు, మెడక్రింది ఎముకలు కనిపించనివాడు, ఆజానుబాహువు, చక్కటి నుదురు కల పరాక్రమవంతుడు,

11. అవయవాలన్నీ సమతూకంలో కలవాడు, మిసమిసలాడే శరీరచ్ఛాయ కలవాడు, ప్రతాపవంతుడు, దృఢమైన రొమ్ము కలవాడు, విశాలమైన నేత్రాలు కలవాడు, శ్రీమంతుడు, లక్షణమైనవాడు,

12. ధర్మాన్ని తెలిసినవాడు, సత్యవ్రతుడు, జన హితాన్నే కోరేవాడు, కీర్తివంతుడు, జ్ఞానసంపన్నుడు, పవిత్రుడు, ప్రార్థనలను తక్షణమే వినేవాడు, క్రమశిక్షణను పాటించేవాడు,

13. బ్రహ్మతో సమానమైన సంపత్తు కలవాడు, బ్రహ్మ; శత్రు సంహారకుడు, జీవులను, ధర్మాన్ని

రక్షించేవాడు,

14. స్వధర్మాన్ని, స్వజనులను రక్షించేవాడు, వేదవేదాంగాలను క్షుణ్ణంగా తెలిసినవాడు, ధనుర్వేదంలో ప్రవీణుడు,

15. సమస్త శాస్త్రాలనూ సమగ్రంగా గ్రహించినవాడు, మంచి జ్ఞాపకశక్తి కలవాడు, అమోఘమైన కల్పనా శక్తి కలవాడు, అందరిచేత ప్రేమించబడేవాడు, సాధుతత్వం కలవాడు, దైన్యం లేనివాడు, విచక్షణ కలవాడు,

16. సముద్రం పుణ్య నదులనే ఆకర్షించినట్లు, ఎల్లవేళలా తాను సజ్జనుల సాంగత్యమే పొందువాడు, గౌరవనీయుడు, అందరినీ ఎప్పుడూ సమదృష్టితో, ఆదరంతో చూసేవాడు,

17. సద్గుణవంతుడు, కౌసల్యకు ముద్దుబిడ్డ, సముద్రం వలె గంభీరంగా ఉండేవాడు, ధైర్యంలో హిమవంతునివంటివాడు,

18. విష్ణువంతటి వీరుడు, చంద్రునివంటి అందగాడు, ప్రళయాగ్నితో సమానమైన కోపము, భూమితో సమానమైన సహనము కలవాడు,

19. కుబేరునివలె ధనవంతుడు, ధర్మదేవతతో సమానమైన ధర్మనిష్ఠ కలవాడు, పరాక్రమవంతుడు, అయిన రాముడు సకల సద్గుణాలకూ నిధి.

20. దశరథ మహారాజుకు ఇతను మొదటి కొడుకు, అతి ప్రియమైనవాడు. చాలా మంచివాడు. అతని సహజమైన మంచి స్వభావం చేత అందరికీ ప్రియమైనవాడు.

21. ప్రజలను మెప్పించడం కోసం రాజు ఇతనికి యువరాజ పట్టాభిషేకం చెయ్యాలని నిశ్చయించాడు. ఈ విషయం అతని భార్య కైకేయికి తెలిసింది.

22. పూర్వం రాజు తనకిచ్చిన రెండు వరాలను ఆమె ఇప్పుడు కోరింద్.. అవి: 1. రాముడు (14 సంవత్సరాలు) వనవాసానికి వెళ్ళాలి. 2. భరతునికి పట్టాభిషేకం చెయ్యాలి.

23. సత్యానికి (తన వాగ్దానానికి), ధర్మానికి కట్టుబడిన దశరథుడు తనకు అతి ప్రియమైన రాముణ్ణి వనవాసానికి వెళ్ళమన్నాడు.

24. తండ్రి ఆజ్ఞానుసారం, కైకేయి ఇష్టానుసారం, తన తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టడం కోసం

వీరుడైన రాముడు వెంటనే వనవాసానికి అంగీకరించాడు.

25. అన్న మీది ప్రేమతో అతనిని సవినయంగా ఆశ్రయించి ఉండే సుమిత్ర ప్రియపుత్రుడైన లక్ష్మణుడు అతనిని అనుసరించాడు.

26-28. రామునికి ప్రాణసమానమైన భార్య, జనక మహారాజుకు మాయ ప్రభావంచేత కలిగిన కూతురు సీత సద్గుణవతి, స్త్రీరత్నం; చంద్రుని రోహిణీ నక్షత్రం అనుసరించినట్లు, రామునితో అరణ్యావాసానికి ఉపక్రమించింది. పురజనులు, తండ్రి దశరథ మహారాజు, కొంత దూరం వరకూ వారిని అనుసరించారు.

29-30. గంగాతీరంలో ఉన్న శృంగిబేరపురం వద్ద రథసారథి అయిన సుమంత్రునికి వీడ్కోలు పలికి, గుహుని సహాయంతో ఆ నిండుగా ప్రవహిస్తున్న నదిని దాటారు సీతారామ లక్ష్మణులు.

31-32. భరద్వాజ మహర్షి ఆదేశానుసారం చిత్రకూటం చేరిన ఆ ముగ్గురూ ఒక మంచి కుటీరాన్ని నిర్మించుకుని దేవ, గంధర్వులవలె సంతోషంగా కాలం గడిపారు.

33. ఆ సరికి రాముని వియోగాన్ని భరించలేక దశరథుడు స్వర్గస్థుడైనాడు. రాజు మరణించిన తరువాత వశిష్ఠాది ప్రముఖులు

34. భరతుని రాజ్యం ఏలమన్నారు. భరతుడు దానికి అంగీకరించక, రాముడిని వెనక్కి పిలవడం కోసం అరణ్యానికి బయలుదేరాడు.

35. మహాత్ముడు, సత్యసంధుడు, పరాక్రమవంతుడు అయిన అన్నగారైన రాముడిని ధర్మబద్ధుడైన భరతుడు యాచించాడు,

36. "రాజ్యపాలనకు నీవే అర్హుడివి", అంటూ. అందరినీ సంతోషపెట్టే స్వభావం కల బలశాలి రాముడు.

37. తండ్రి ఆజ్ఞను తిరస్కరించడానికి ఇష్టపడక, తనకు ప్రతీకగా తన పాదుకలను భరతునికి అనుగ్రహించాడు. భరతుని అన్నగారైన రాముడు

38. వీడ్కోలు పలికాడు. ఆ విధంగా తన సంకల్పం ఫలించనందుచేత భరతుడు

39. నందిగ్రామం చేరి, అచటినుండే, రాముని రాకకై నిరీక్షిస్తూ, జితేంద్రియుడు, సత్యసంధుడు

అయి రాజ్యపాలన చేసాడు.

40. ఇక్కడే ఉంటే పౌరుల రాకపోకలు తప్పవనే ఆలోచనతో రాముడు ఆ ప్రదేశాన్ని వదలి, దండకారణ్యం ప్రవేశించాడు.

41. ఆ మహారణ్యంలో ప్రవేశించిన రాజీవలోచనుడైన రాముడు విరాధుడనే రాక్షసుడిని సంహరించి, శరభంగాది మహర్షులను దర్శించాడు.

42. సుతీక్ష్ణుడు, అగస్త్యుడు, సుదర్శనుడు అనే మహర్షులను దర్శించాడు. ఇంద్రుని ధనుస్సును, బాణాలను,

43.  ఇంద్రుని ఖడ్గాన్ని, అక్షయ తూణీరాన్ని అగస్త్యుని వద్ద స్వీకరించాడు. అరణ్యంలో నివసిస్తున్న మునులు

44. వారిని బాధిస్తున్న రాక్షసులను సంహరించమని రాముడిని కోరారు. రాముడు వెంటనే అంగీకరించాడు.

45. అగ్నివలె ప్రకాశించే అక్కడి ఋషులకు రాముడు రాక్షససంహారం చేస్తానని వాగ్దానం చేసాడు.

46. జనస్థానంలో శూర్పణఖ అనే రాక్షసికి ఏ రూపాన్నైనా ధరించే శక్తి ఉంది. (ఆమె బాధను భరించలేక) లక్ష్మణుడు (అన్న ఆజ్ఞానుసారం) ఆమెను (ముక్కు, చెవులు కోసి) కురూపిగా చేసాడు.

47. ఆమెకు కలిగిన దుఃఖానికి ఆగ్రహించిన రాక్షసులు, ఖరుడు, త్రిశిరుడు, దూషణుడు రామునిపై దండెత్తారు.

48. యుద్ధంలో రాముడు వారిని, వారి అనుచరులనూ, ఇంకా జనస్థానంలోని

49. 14,000 రాక్షసులనూ హతమార్చాడు. తన బంధువుల మరణ వార్తను విన్న రావణుడు మండిపడ్డాడు.

50. తనకు సహాయం చెయ్యమని, మారీచుడనే రాక్షసుడిని ఆజ్ఞాపించాడు. ఈ పని చేయవద్దని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు మారీచుడు.

51. "బలవంతుడైన రామునితో మనకు విరోధం తగదు" అని. అవసానకాలం దగ్గరకు వచ్చిన రావణుడు అతని మాటలను పెడచెవిన పెట్టాడు.

52. రావణుడు మారీచుని వెంటబెట్టుకుని రాముడు నివసించే ఆశ్రమానికి వెళ్ళాడు. మారీచుడు రామలక్ష్మణులను మాయ చేసి దూరంగా తీసుకుపోగా, రావణుడు రాజకుమార్తె అయిన సీతను అపహరించాడు.

53. సీత అపహరింపబడిన వార్తను విని, జటాయువు ఆమెను రక్షించే ప్రయత్నంలో గాయపడి, ప్రాణం విడువటం చూసిన రాముడు దుఃఖం పట్టలేక కన్నీళ్ళు కార్చాడు.

54. అంతటి పట్టరాని దుఃఖంలోనూ కూడా, శ్రద్ధగా జటాయువుకి దహన సంస్కార విధులను నిర్వహించాడు రాముడు.

55. సీతకోసం వెతుకుతూ ఉన్నప్పుడు వికృతమైన రూపంతో ఉన్న కబంధుడనే రాక్షసుడిని చూశాడు.

56. రాముడు అతనిని సంహరించి, దహన సంస్కారం చేసాడు. ఆ రాక్షస శరీరంలో ఉన్న గంధర్వునికి శాపవిమోచనం కలిగి స్వర్గానికి వెళ్ళాడు. అతను రాముడికి ధర్మచారిణి అయిన శబరిని దర్శించమని సూచన చేసాడు.

57. శబరి యొక్క భక్తిని, గుణగణాలను రామునికి వర్ణించాడు.

58. శత్రుసూదనుడు, దశరథపుత్రుడు అయిన రాముడు శబరి పూజలను ఆదరంగా స్వీకరించాడు. పంపానదీ తీరాన హనుమంతుని కలిసాడు.

59. హనుమంతుని మనవిని మన్నించి సుగ్రీవుడిని కలిసాడు.

60. బలవంతుడైన రాముడు సీతాపహరణ వివరాలను సుగ్రీవునికి తెలియపరిచాడు. అది విన్న సుగ్రీవుడు

61. ఇష్టపడి అగ్ని సాక్షిగా రామునితో స్నేహం చేసాడు. పిమ్మట వానరరాజైన సుగ్రీవుడు తనకు

62. వాలితో గల శత్రుత్వాన్ని రామునికి వివరించాడు. రాముడు వాలిని వధిస్తానని సుగ్రీవునికి మాటిచ్చాడు.

63. సుగ్రీవుడు రామునికి వాలి యొక్క బలపరాక్రమాలను వర్ణించాడు. వాలిని వధించే శక్తి రామునికి లేదేమోనని సందేహించాడు.

64. వాలి సంహరించినటువంటి పర్వతమంత ఎత్తు ఉన్న దుందుభి అనే రాక్షసుని అస్థిపంజరాన్ని రామునికి చూపించాడు.

65. చిరునవ్వు నవ్వుతూ రాముడు తన కాలి బొటనవ్రేలితో ఆ అస్థిపంజరాన్ని పూర్తి పది యోజనాల దూరం పైకెగిరి పడేలాగ తన్నాడు.

66. అదొక్కటేకాక, ఏడు మద్దిచెట్లను ఒకే ఒక బాణంతో ఛేదించాడు. అవి చాలా దూరం పైకెగిరి క్రింద పడ్డాయి.

67. ఇవి చూశాక సుగ్రీవునికి రామునిపై విశ్వాసం కుదిరింది. రాముని వెంటబెట్టుకుని సుగ్రీవుడు కిష్కింధకు వెళ్ళాడు.

68. బంగారు వర్ణంతో మిసమిసలాడుతున్న సుగ్రీవుడు సింహంలాగ గర్జించాడు. ఆ శబ్దం విని, వాలి యుద్ధానికని వెలుపలికొచ్చాడు.

69. సుగ్రీవునితో యుద్ధమనేసరికి తార (వాలి భార్య) అనుమానపడింది. (వెళ్ళవద్దని వారించింది, కాని వాలి వినలేదు). యుద్ధంలో ఒకే బాణంతో రాముడు వాలిని వధించాడు.

70. ఆ విధంగా తన మాట ప్రకారం వాలిని యుద్ధంలో చంపిన రాముడు సుగ్రీవునికి కిష్కింధా రాజ్యాన్ని అప్పజెప్పాడు.

71. ఆ వానరరాజు (సుగ్రీవుడు) తన వానరులనందరినీ సమావేశపరచి నలుదిక్కులకూ వెళ్ళి సీతను వెదుకమని ఆజ్ఞాపించాడు.

72. సంపాతి అనే గ్రద్ద ఇచ్చిన సూచన ప్రకారం బలవంతుడైన హనుమంతుడు ఎగిరి వంద యోజనాల వెడల్పు గల సముద్రాన్ని దాటాడు.

73. రావణాసురుడు పరిపాలిస్తున్న లంకా పట్టణాన్ని చేరి, అక్కడ అశోకవనంలో రామధ్యానంలో ఉన్న సీతామాతను దర్శించాడు.

74. సీతమ్మకు రాముని ముద్రికనిచ్చి, అతని క్షేమవార్తను తెలిపి, ఆమెను దుఃఖం నుండి ఓదార్చాడు. ఆ వనం యొక్క సింహద్వారాన్ని బ్రద్దలు కొట్టాడు.

75. ఐదుగురు సేనాధిపతులను, ఏడుగురు మంత్రుల కొడుకులను, శూరుడైన అక్షుని (రావణుడి కొడుకు) సంహరించిన పిమ్మట, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రంచే కట్టుబడ్డాడు.

76. ఏ ఆయుధాలూ అతనిని గాయపరచని కారణంచేత రాక్షసులు, ఇతనికి బ్రహ్మ, ఇతర దేవతలూ ఇచ్చిన వరాలెన్నో ఉన్నాయని గ్రహించారు. (అతనిని రావణుని ముందర నిలబెట్టారు). వారు పెట్టిన బాధలనన్నిటినీ హనుమంతుడు ఓర్చుకున్నాడు.

77. లంకానగరాన్ని తగులబెట్టి, సీతమ్మను మరొక్కసారి ఓదార్చి, రాముని వద్దకు తిరిగి వచ్చాడు హనుమంతుడు.

78. మూడుసార్లు రామునికి ప్రదక్షిణం చేసి, "చూశాను సీతను", అని వార్తను తెలిపాడు.

79. సుగ్రీవుని (సైన్యంతో సహా) వెంటబెట్టుకుని రాముడు సముద్రతీరం చేరాడు. (దాటడానికి దారినిమ్మని ప్రార్థించాడు. సముద్రం సహకరించని కారణంగా) సూర్యునివలె శోభిస్తున్న రాముడు బాణప్రయోగం చేస్తానని  సముద్రుడిని బెదిరించాడు.

80. నదులకు పతియైన సముద్రుడు దేవతారూపంలో ప్రత్యక్షమై నలుని సహాయంతో వంతెన నిర్మించి, సముద్రాన్ని దాటవచ్చని సలహా ఇచ్చాడు.

81. ఆ ప్రకారంగా లంకను చేరి, రావణుని యుద్ధంలో వధించి, సీతను తిరిగి పొందిన రాముడు, సీత శీలాన్ని శంకించాడు.

82. వేలసంఖ్యలో ఉన్న సైన్యానికి ఎదురుగా రాముడు తనతో పలికిన పరుషవాక్కులను సహించలేక, అగ్నికుండంలో దూకింది సీత.

83. అగ్నిదేవుడే స్వయంగా సీత యొక్క పవిత్రతను పొగిడి ఆమెను సురక్షితంగా రామునికి సమర్పింపగా, రాముడు ఆమెను సంతోషంగా స్వీకరించాడు. దేవతలు రాముని స్తుతించారు.

84. రావణ సంహారంతో ముల్లోకాలలోని సమస్త జీవరాశులు, దేవర్షి గణాలు, జడపదార్థాలు కూడా సంతోషించాయి.

85. రాక్షసరాజైన విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకం జరిపించి, తాను సంకల్పించిన కార్యం సఫలమవడంతో రాముడు సంతోషించి, విశ్రాంతిగా ఊపిరి పీల్చుకున్నాడు.

86. దేవతల వద్ద అనేక వరాలను పొంది, దేవతావిమానమైన పుష్పకాన్ని ఎక్కి, రాముడు వానరులతో, బంధుమిత్ర సమేతంగా అయోధ్యకు ప్రయాణమయ్యాడు.

87. దారిలో భరద్వాజాశ్రమంలో ఆగి, భరతునికి తమ రాకను తెలియజేయమని హనుమంతుని దూతగా పంపించాడు.

88. సుగ్రీవ సహితంగా మరల పుష్పకవిమానాన్ని ఎక్కి, (దారిలో సీతమ్మకు జరిగిన విషయాలన్నీ ముచ్చటలు చెప్తూ) రాముడు నందిగ్రామం చేరాడు.

89. నందిగ్రామంలో తమ తాపసవేషాలను విడిచిపెట్టి, తమ్ములతో సహా పరమపావనుడు, సీతా సమేతుడైన రాముడు, రాజోచితమైన వస్త్రాభరణాలను ధరించి, అయోధ్యలో పట్టాభిషిక్తుడై తిరిగి తన రాజ్యాన్ని మరల పొందాడు.

90. ఆయన పరిపాలనలో లోకాలన్నీ సుభిక్షంగా, తృప్తిగా, బలంగా, నిర్భయంగా, ఆరోగ్యంగా, ఆనందంగా, ధర్మంగా, శాంతిగా కాలం గడిపాయి.

91. (రామరాజ్యంలో) పుత్రశోకం, వైధవ్యం, దుశ్శీలం అనేవి లేవు. స్త్రీలందరూ పాతివ్రత్యాన్ని పాటించారు.

92. అగ్ని ప్రమాదాలు, తుఫానులు, సుడిగాలులు, వ్యాధులు లేవు.

93. ఆకలి బాధ, దొంగల భయం లేవు. నగరాలలోను, రాష్ట్రాలలోను పాడిపంటలు సమృద్ధిగా ఉన్నాయి.

94. సత్యయుగంలోలాగ అందరూ ఎల్లప్పుడూ సుఖంగా, సంతోషంగా ఉన్నారు. రాముడు లెక్కలేనన్ని అశ్వమేధయాగాలు చేసాడు. బంగారం,

95. గోవులు, ధనము, అర్హులైన బ్రాహ్మణాదులకు విరివిగా దానం చేసాడు. ఈ సత్కార్యాలచేత బ్రహ్మదేవునికి రాముడు ప్రీతిపాత్రుడయ్యాడు.

96. శతవిధాలుగా రాముడు రాజ్యవంశాలను, రాజ్యపరిపాలనను ధర్మమార్గంలో తీర్చిదిద్దాడు. నాలుగు వర్ణాల జనులనూ తమ తమ స్వధర్మపాలనకు  పురికొల్పాడు.

97. పదకొండువేల సంవత్సరాలు ధర్మపరిపాలన చేసిన పిదప రాముడు తిరిగి తన స్వస్థానమైన వైకుంఠాన్ని చేరుకున్నాడు.

98. ఈ చరిత్ర చాలా పుణ్యప్రదమైనది. పాపాలను పోగెట్టే శక్తి కలది. వేదసమానమైనది. ఈ రామచరిత్రను చదివినవారి పాపాలన్నీ క్షయమైపోతాయి.

99. ఈ పవిత్రమైన రామాయణ గాథను చదివినవారు మంచి సంతానంతో, బంధుమిత్రులతో, సుఖశాంతులతో ఆరోగ్యంగా జీవించి, చివరకు స్వర్గాన్ని పొందుతారు.

100. దీనిని చదివిన బ్రాహ్మణుడు పండితుడవుతాడు; క్షత్రియుడు రాజవుతాడు; వైశ్యుడు లాభాన్ని పొందుతాడు; శూద్రుడు
గొప్పవాడవుతాడు.

101. ఫలశ్రుతి: పుణ్యప్రదము, పాపహరము, సదా మంగళకరము, విజ్ఞాన దాయకము, భక్తి ప్రదము, మాయామోహ నివారకము, పవిత్రము, నిర్మల ప్రేమపూర్ణము, శుభము అయిన ఈ రామచరిత్రను భక్తిశ్రద్ధలతో పఠించినవారు భయంకరమైన సంసారాగ్నిచే దహింపబడక, మోక్షాన్ని పొందుతారు.

వాల్మీకి మహర్షిచే రచింపబడిన, ఆదికావ్యమైన శ్రీమద్రామాయణం లోని ప్రథమ సర్గమైన సంక్షేప రామాయణము సమాప్తము.